

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

వీరి జననము — రుధిరోద్గారినామ సంవత్సర భాద్రపద శుద్ధ పంచమి (15–9–1923). జన్మస్థానము — కృష్ణాజిల్లాలో గల జగ్గయ్యపేట.

వీరు — ప్రాథమిక విద్యాభ్యాసము పూర్తియైన పిమ్మట, తమ తండ్రి గారయిన శ్రీమాన్ శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తుల సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులవారివద్దనే సంస్కృతములో నాటకాంత సాహిత్యము, సిద్ధాంత కౌముది, తర్క సంగ్రహము మున్నగువానిని అధ్యయనము చేయుటయేగాక, తిరుమంత్రార్థాది సంప్రదాయ గ్రంథములనుగూడ అత్యంత శ్రద్ధాసక్తులతో నధికరించిరి.

1940 లో - సంగీత విద్యాభ్యాస మారంభించి, శ్రీమాన్ చిలక మఱ్ఱి కందాడై కేశవాచార్యులవారి వద్దను, 'గాయక సార్వభౌమ' బిరుదాలంకృతులగు శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి వద్దను సంగీత శాస్త్రములోఁ గల విశేషాంశములను గ్రహించి, గాత్ర సంగీతమునందును, ఫిడేలు వాదనమునందును మిక్కిలి నైపుణ్యమును సంపాదించిరి.

హరికథా కథనమునందుగూడ, తగిన ప్రజ్ఞాపాటవములను సంపాదించి, త్యాగరాజు, గోదాదేవి, రుక్మాంగద మొదలగు హరికథలను పలు తావులలో గానముచేసి, శ్రోతలను తన్మయుల గావించిరి.

ఆంధ్ర, ఆంధ్రేతర రాష్ట్రములలో — ఆంధ్ర దాక్షిణాత్య గాయకాగ్రేసరు లనేకులు గాత్ర కచేరీలు చేయు సందర్భమున కడు శ్రావ్యముగ ఫిడేలు వాయించి, మన్నన లందుకొనిరి.

ఉభయ భాషలలో కావ్య నిర్మాణముచేయఁగల శక్తి సామర్థ్యములను సంపాదించి, ఉభయ వేదాంతములలో నుద్దండ పండితులుగా విఖ్యాతి గడించి, సంగీత సాహిత్యములకు, మత సంప్రదాయములకు ఎనలేని సేవ గావించి, 'సంగీత సాహిత్య కళానిధి' యను బిరుదము పొందిరి.

బహుముఖ ప్రజ్ఞావిశేషములుగలవారయ్యును, నిరాడంబరులుగా — సరస సంభాషణ చతురులుగా — సంప్రదాయ విజ్ఞాన వేత్తలుగా — సహృదయులుగా విరాజిల్లుచుండుటనుబట్టియే, వీరిని ఆకాశవాణివారు సగౌరవముగా ఆహ్వానించి, విజయవాడ రేడియోకేంద్రమున 1948 సంవత్సరమున నిలయ సంగీత విద్వాంసులుగా నియమించియున్నారు.

**రచనలు :**

**ముద్రితములు :** (1) త్యాగరాజ చరిత్ర (2) గోదా త్రింశన్మాల (3) శఠకోప చరిత్రము (4) నారాయణ శతకము (పద్యకావ్యములు).

**అముద్రితములు :** (1) భూ ప్రశంస (2) చంద్రకళా త్రింశత్ (ఇవి రెండును సంస్కృత ఖండ కావ్యములు) (3) నౌకా చరితమ్ (సంస్కృత కావ్యము) (4) బిడాల మోక్షము (ఆంధ్ర వ్యంగ్య కావ్యము) (5) గజేంద్ర మోక్షము (యక్ష గానము) (6) వీరపానము (ఆంధ్ర ఖండ కావ్యము) (7) ఆంధ్ర ముకుందమాల (గేయ కృతి) (8) శ్రీనివాస కల్యాణము (యక్ష గానము) ఇత్యాదులు. ఇవి గాక, సంస్కృతాంధ్రములలో వీరిచే రచింపఁబడిన కీర్తన లనేకములు కలవు.



శ్రీమాన్ కొమాండూరి
రామానుజాచార్యులు

వీరి జననము — విభవనామ సంవత్సర ఆషాఢబహుళ పంచమీ శుక్రవారము (6–7–1928). జన్మస్థానము — ఒంగోలు మండలమునగల తక్కెళ్ళపాడు అగ్రహారము.

వీరు — పొన్నూరులోఁ గల శ్రీ భావనారాయణస్వామి దేవస్థానమువారి సంస్కృత కళాశాలయందు విద్యాభ్యాసము గావించి, 1957-వ సంవత్సరమున 'భాషా ప్రవీణ' పరీక్షలో నుత్తీర్ణత నందిరి.

విద్యార్థిదశనుండియే ఆంధ్ర భాషలో ననేక ప్రక్రియల ననుసరించి, గద్య పద్యాత్మకములైన రచనలను వెలయించి, వానిని పత్రికలలో ప్రకాశింపఁజేసిరి.

కొంత కాలము శతక వాఙ్మయముపై ప్రత్యేకమైన పరిశోధనఁ గావించిరి.

అనేక తాళపత్ర గ్రంథములను సంపాదించి, వానిపై సమీక్షలు వ్రాసి, 'భారతి' వంటి ప్రఖ్యాత సాహిత్య పత్రికలలో ప్రచురింపఁజేసిరి.

అట్టి సమీక్షల నన్నింటిని ఒకటిగా జేర్చి, 'అజ్ఞాతాంధ్ర కవులు' అనుపేర నొక ప్రత్యేక గ్రంథముగా వెలువరింపవలెనని వీరికి అభిలాష ఉన్నది.

వీరు తమ కష్టకాలమున 'శ్రీ వేంకటేశ్వర కరావలంబ స్తోత్రము'ను గీర్వాణభాషలో రచించిరి.

విజ్ఞాన భిక్ష నిడు మని, నూటపదునారు పద్యములతో — 'మధురాంజలి'ని సంఘటించిరి.

తమ తమ కవితాసౌరభముల నందజేయుఁడని సంస్కృతాంధ్ర కవులకు 'మణిహారము' గూర్చిరి.

కవిసార్వభౌముని కమనీయ కవితా విశేషముల నుగ్గడించుచు — 'శ్రీనాథుడు' అనుపేర నొక సమీక్షా గ్రంథమును గుబాళింపఁజేసిరి.

తమ అభిమాన దైవమగు శ్రీవేంకటేశ్వరస్వామివారిని 'స్తోత్ర పారిజాతము'లతో నర్చించిరి.

శాసనాధారములతో — ప్రాచీన చరిత్రాధారములతో — 'కందుకూరిసీమ' ప్రశస్తిని లోకమునకు వెల్లడింపఁ దలచి, మూఁడు సంవత్సరముల క్రితమే గ్రంథ రచనకు శ్రీకారము జుట్టిరి.

సంస్కృతాంధ్ర భాషల వరివస్య నెరపుటయందును, అతులిత విజ్ఞాన మాధురీ మహిమలచే విరాజిల్లు పండితాఖండుల సేవించుటయందును వీరికి విద్యార్థిదశ నుండియే విశేషమైన ఆసక్తి అలవడియున్నది.

వీరిపుడు నెల్లూరుమండలమునఁ గల కనిగిరిలో — జిల్లాపరిష దత్యున్నత పాఠశాలయందు ప్రధానాంధ్రోపాధ్యాయులుగా పనిచేయుచున్నారు.

# రెండవ భాగములో

# రానున్న రచనలు



౧. శ్రీనివాస స్తవ రాజము

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులు

౨. మోక్షసాధనములు - ప్రపత్తిదర్శనము

శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు

౩. ముకుందమాల

మధ్వశ్రీ - పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు

౪. భాగవత మత వైభవము

శ్రీమాన్ నిడమర్తి కందాడ గోవిందరాజ శ్రీభాష్యకారాచార్యులు

౫. పన్నిద్దరాళ్వారులు - నాలాయిర దివ్య ప్రబంధము

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

౬. పాణయోగి ప్రభావము

శ్రీమాన్ కొమాండూరు గోపాలకృష్ణమాచార్యులు

౭. శ్రీ నమ్మాళ్వారుల వైభవము

శ్రీమాన్ టి.కె.వి.యన్. సుదర్శనాచార్యులు

౮. వకుళాభరణ సౌరభము

శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు

౯. మధురసూక్తి

శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు

౧౦. కంబ మహాకవి - శఠకోప ప్రశంస

శ్రీమాన్ తిరుమల పెళ్లూర్లమూడి నారాయణస్వామి

౧౧. విష్ణుచిత్తుల కవిత్వము

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు

౧౨. శ్రీ గోదాసూక్తిమాల

శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యులు

